# క్రైస్తవ భక్తి గీతములు

## మనస్సునకు నిజమైన నెమ్మదే ముఖ్య భాగ్యము

1.

"నిన్ను నమ్మినవాని నీవు చాలా నెమ్మదియందు కాపాడుదువు"
యెషయా 26: 3.

రా-సౌరాష్ట్ర) తా-ఆది

మనసానందము బొందుటకన్నను-మఱియే భాగ్యముగలదన్న=అను
దినములిక నఖిలసుఖంబులు - దినమొక గడియకతీరియుండును॥
మనసానందము॥

1 దిటముగ బ్రార్థన యను ఖడ్గము గని - దిగుగు పిశాచము వెర
చన్న=పటు శత్రులు గల ప్రభు శాస్త్రోక్తులు - బహు సంశయ
పంకము నింకించును ॥మనసానందము॥

2 సాధు జనోత్తమ క్రైస్తవ సంగతి-సమకూడిన మేలౌనన్న=క్రోధ
ములన్నిటి స్థిరముగ దోల్పడి-శుభమతికన్నను సుఖమేమున్నది॥మన

3 తనువున దాగనువానికి దురితము - దగిలెడు విధి గనవలెనన్న=
ఒనరగ క్రీస్తుని కథ్యస్తంభము - గని విశ్వాసము గట్టిగ బెంచిన॥
మనసానందము॥

4 తమయందు స్నేహము ప్రభుకడ కోర్చిన-శత్రువు లిక భువిలేరన్న=
సమదృష్టి జగజ్జనుల గనుంగొను-సత్క్రియ స్తవులకు సాధనమనదగు॥
మనసానందము॥

5 పరమ దయానిధి క్రీస్తుని బలమున - పాప భరంబులు విడువన్న =
పరిశుద్ధాత్ముని బంధుత్వంబున-వరమగు చీకటులన్నియు దొలగును॥
మనసానందము॥

## లోకము మాయ

2.

"అన్నియు మాయ, సూర్యునిక్రింద మనుష్యుడు పొందుచున్న ప్రయాసము
వల్ల అతనికి కలిగిన లాభమేమి? చూచుటవలన కన్ను తృప్తి
పొందదు; వినుటవలన చెవినిండదు." ప్రసంగి 1: 2, 3, 8.

రా-ఎమునకల్యాంభోజి తా-ఆది.

మాయలోని మాయ సర్వము-మాయ లోకమాయరా= కాయము
సోపాయము నా-దాయ మెల్ల మాయరా ॥మాయలోని॥

1 మంటిలోన సర్వంబు పుట్టి-మంటగలసిపోవురా=ఒంటిగా వచ్చెడి
యాత్మ-ఒంటిగానె పోవురా ॥మాయలోని॥

2 పుట్టుచుందు రెందరో, మృతి-బొందుచుందు రెందరో= పుట్టిన
వ్యాపారమబ్బె-మృత్యువునకు ధూపలికేర ॥మాయలోని॥

3 ఎంత సంపదున్నగాని, నా - సంతలోనె వీడుర=సంతగొల్లు దీరి
పట్టు-సర్వముడిగి పోవుర ॥మాయలోని।

4 రూపులు జూచేటి కన్ను - మాపు తృప్తిబొందుర=మాపురేపులేని
చోట-జూపుమా పె చూడర ॥మాయలోని॥

5 డెందమానందంబు నిండు - డెంద దీనమందుర = అందముగను
క్రీస్తుపాద-మందు భక్తినిల్పర ॥మాయలోని॥

6 అనచెల్ల గాలిమాట - లట్లుగా కేను చెప్పెర=యేసు నామామృతము
గ్రోలు మంతియే సారంబు ॥మాయలోని॥

## దేవుని ప్రేమ

3.

" దేవుడు లోకమును ప్రేమించెను. ఏలాగనగా, ఆయన తన జనితైక
కుమారునియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్య
జీవము పొందుటకై, ఆయనను ఇచ్చెను." యోహాను 3:16

రా-ఆనందభైరవి — తా-ఝంపె

దేవుని ప్రేమ యిదిగో - జనులారా - భావంబునం దెలియరే=కేవ
లము నమ్ముకుంటే-పరలోక-నివాసంబు మీకబ్బును ॥దేవుని॥

1 మానవుల రక్షింపను-దేవుండు - తనకుమారుని బంపెను=మనశరీరము
దాల్చెను యీప్రభు-మనపాపములకు దూరుడై ॥దేవుని॥

2 యేసుక్రీస్తను పేరున-రక్షకుడు - వెలసి వాడిలోపల= దోసకారిజ
నులతో - నెంతో సుభావముల బల్కినాడే ॥దేవుని॥

3 పాపభారంబుతోను-యేప్రొద్దు - ప్రయాసముల బొందెడి=పాపు
లందరు నమ్మిన-విశ్రాంతి-పరిపూర్ణమిత్తుననెను ॥దేవుని॥

1 కలువరిగిరి దనుక సిలువమోయలేక - కలవరమునొందినావా = సిలువ
నీతో మోయ తులువలు వేరొక ని-తోడుగానిచ్చినారా ॥ఏపాప॥
2 చెరుగు యూదులు కొట్టు పదరాని పాట్లకు-కుడిగడిగడిచినావా =
కడకు కల్వరిగిరి కడకేగి సిల్వను - గడకొని దించినావా ॥ఏపాప॥
3 ఆకాలకర్ములు భీకరంబుగ నిన్ను-యాకొయ్యపైనుంచిరా = నీకాళ్లు
చేతులు యాకొయ్యకేసి - మేకులతో గుచ్చినారా ॥ఏపాప॥
4 ముళ్లంతో కిరీట మల్లి నీ శిరముపై - జల్లాటమున మొత్తిరా = ముళ్ల
పోట్లకు శిరము తల్లడిల్లగ సొమ్మ-సిల్లిపోతివి కర్తా ॥ఏపాప॥
5 పలువిధంబుల శ్రమలు చెలరేగ తండ్రీ - దూలునొత్తి మొరలిడితివా =
సిలువపై పలుమారు కలుగుచుండెడి బాధ - కలన దాహము
బాయనా ॥ఏపాప॥
6 పల్లెమంటకు బంటుబల్లెమున నీ ప్రక్క - చిల్లిపడ పొడిచినారా = ఉల్లో
లములవలె నల్లనీరు బక్కంగ - చల్లారగద కోపము ॥ఏపాప॥
7 కటకటా పాపసంకటము బాపుటకింత - పటువేదనొందినావా =
యెటువంటి ప్రేమ యెటువంటి దీకాంత - యెటులకర్పింతు దేవా
ఏపాప॥

---

## రక్షకుడు యేసే

6.

"ఇంకొకనిచేత ఏమార్గమైనను రక్షణలేదు" అపొ. 4: 12.

రా- ఆసావేరి  తా- త్రిపుట

నీకన్న యితరుల వేల్పులు లేరయ్య-నిజముగా నా యేసువా = నీ

కరుణయ నేకానరుచేతను- నీమసత్యమువార్త ద్వారా - ప్రాకటంబుగ
నన్ను బిలిచిన-లోకరక్షక నీకు మ్రొక్కెద॥ నీకన్న॥
1 నిన్ను దెలియకమున్ను అన్యదైవములను-అనుసరించినపాపము=లన్ని
బెనగొనినాదు హృదయము-కన్ను గ్రమ్మి ప్రకాశమియ్యక-నున్న
నీనిమలాత్మవరమున-నన్ను వెలిగించిన దయానిధి ॥నీకన్న॥
2 వదలక నేజేయు గుదశేని పాపములు - వదలించినను బ్రోచితి=
ఈ దిదినంబున గలుగుబాధల- దొలగజేయను నీవటనివా - హృదయ
మందున శానిర్భీతుణ- పదిలపరచిన భక్తపాలక ॥నీకన్న॥
3 నీవాక్యార్థము వాలోచివవింపజేసి నీ - సేవకునిగ బ్రోవవే=నీవె
సత్యము నీవె జీవము-నీవె మార్గము నీవె ధ్యానము - నీవె గాకింకెవరు
లేరిక-కావవె నను యేసునాయక ॥నీకన్న॥

## క్రీస్తు నామము అసమాన్యము

7.

"క్రీస్తుయొక్క పేరు ఒప్పుకొనే ప్రతివాడును దుర్నీతినుండి తొలగవలె
ననేదియునైన ముద్రకలిగియున్నది." 2 తిమోతియు 2:19

రా-కాంభోజి తా-ఆది

యేసు నీ నామామృతము - మాకెంతో రుచియయ్యా=మా దోస
ములనుహరించి మోక్ష ము-వారులుగ జేసుటకు - భూసుర ప్రకా
శమైన ॥యేసునీ॥

4 పరిశుద్ధాత్మ లేనిది - జీవము లేని - బ్రతుకే బ్రతుకుగాదది=దురితే
స్ఫలము గొప్ప - యుక్తులందగిలి భక్తి - తరిగి పోవుటకది-దొరక
నందు కొనుము ॥పరిశుద్ధాత్మ॥
5 పరిశుద్ధాత్మను పొందుట - యన్నికన్న - ప్రబలమైన కోరిక=
కానిమ్ము పొంగ పెట్టు - పరమపావనుండది-కరుణించి నీకొసగు=
మరణాంతముకు దనుక॥ పరిశుద్ధాత్మ॥

## క్రీస్తుయొక్క ప్రకాశమైన రాకడ

11

"సింహాసనాసీనుడై యున్నవానియొక్కయు, గొఱ్ఱెపిల్లయొక్కయు
ఉగ్రతమహాదినము వచ్చెను. దానికి తాళజాలిన వాడెవడు?"

రా—ముఖారి] ప్రక. 6:17 [తా—ఆది

నాడువచ్చినట్లుగాదు - నేను రాకడ=దేరి - చూడరాదు క్రీస్తు
నింక - స్తోత్రమెచ్చట॥ నాడు॥
1. మొదట గొఱ్ఱెపిల్లరీతి - నొదిగివచ్చెగ=నిపుడు - రౌద్రసింహ
ముయ్యో మనకు - గుండెదిగులుగ॥ నాడు॥
2 దాసుని వలెను దొల్లి - దాచినాముగ=నిపుడు - దోషముంచిన
దండించ - దొరయై వాడుగ॥ నాడు॥
3 ఏ కట్టుబోయిన మనకు - ఎదురు వచ్చెగ=ఓడుగురీతి వాని యు
గ్రమైన - దృష్టి వెచ్చగ॥ నాడు॥

4 కొండ వండలందు దాగి - యుండలేముగ = వాని-యండనుండి
మండే యగ్ని - యదిగో వచ్చెగ ॥నాడు॥
5 దిక్కు-గానక్కట్లు నిత్య - దేవుండా నమ్మి=నట్టి - పుక్కిటి
పురాణములకు - బోయి చెడితిమి ॥నాడు॥
6 పీఠముల బోధించువాని - వినక బోతిమి=నిప్పను బాధగొండ నర
కాగ్నిలో - బడ బాలైతిమి ॥నాడు

## క్రీస్తు తోడైయున్న జాలును

**12.**

“ నేను యుగాంతపర్యంతము దినములన్నియు మీతో కూడనున్నాను.”
మత్తయి. 28: 20

రా — బిళహరి తా — ఆట

నీవు తోడైయున్న జాలు - యేసు నిత్యము నాకదివేలు = నీవు
ధరణినుండు - నీచపాపుల నెల్ల - గావ ప్రేమవచ్చి - ఘనప్రాణ
మిడినట్టి ॥నీవు॥

1 నినుబోలు రక్షకుండేడి - క్రీస్తు - నను బోలు పాతకుండేడి=నిను
నమ్మువారలకు - నీ వొసగుచుందువు - దనరం బాపక్షమ-దయచేత
నిలలోన ॥ నీవు॥

2 నీసాటి బలవంతుడేడి - ప్రభు నాసాటి దుర్బలుడేడి= కాపాడు
చుందువు - కలకాలమును నీవు - నీపాద సేవకుల - నీ నెయ్య
రంజిల్ల ॥నీవు॥

3 నీవంటి యుపకారియేడి - కర్త - నావంటి కఠుదీనుడేడి=జీవుల
కునుగల్గు - జీవంబులిచ్చుచు - నీవాధారముగా నగి - జీవులబ్రో
చెడి॥ నీవు॥

4 నీవంటి ధనవంతుడేడి - యేసు - నావంటి ధనహీనుడేడి=ప్రొవు
లైయున్నవి - యీవులు నీయందు - నీవు వాని నొసంగి - నిర
తంబు ననుగావు॥ నీవు॥

---

## ప్రార్థన.

13.

"ఎందుకనిః, ప్రభువుయొక్క కన్నులు నీతిమంతులమీదను, ఆయన చెవులు వారి ప్రార్థనలవైపునను ఉన్నవి." 1 పేతు. 3·12.

రా—ముఖారి　　　　తా—ఆట

దేవకుమారా - దీనోపకారా=నా వంకదయజూప - నాయన్నరా
రా॥ దేవకుమారా॥

1 వ్రతమును బాసిన - పతిత జనయ్య = శిక్షించిరైన సం - రక్షింప
వయ్యా॥ దేవకుమారా॥

2 పాపులపాలిటి - పరమదయాళో = దాపింపకయ్య నీదయనాకీవేళ
॥ దేవకుమారా॥

3 విమలంతఃసద్గుణ విమలవిచారా=ననుబ్రోవవే యేసు - నామానవతా
రా॥ దేవకుమారా॥

4 భజనచేసెద నిన్ను - నిజరక్షకుండ = విజయముచేయవే - నజరేతు
వాడా॥ దేవకుమారా॥

4 కడు బీదవాడ నంధుడను దౌర్భాగ్యుడను - చెడిపోయి పడియు
న్నాను=సుడివడిన నామదికి స్వస్థత - చెడిన కనులకు దృష్టిభా
గ్యము-బడయకలదివన్ని నీచే - బడయుటకు నా యొద్దకు రా
యిదె॥ యున్నపాటున॥
5 నీవాగ్దత్తము నమ్మి-నీ వైభారము కట్టి-జీవ మార్గము గంటిని=నీ
వబంలగు ప్రేమచేతను - నీవు నన్ను క్షమించి చేకొని - భావశుద్ధి
నొసర్చి సంతో - పాపపగముల నిరుదువనియిదె॥ యున్నపాటున॥
6 దరిలేనియానంద-కరమైన నీప్రేమ-తరమే వర్ణనజేయను=దొరకు
కర్దంబైన యున్నిటి - విరుగగొట్టెను గాన నేనిపు - దరుదుగా
నీవాడనవుటకు- మరి నిజము నీవాడనవుటకు॥ యున్నపాటున।

## పాపమును త్యజించుట

15.

"మిమ్మును మీరు కడుగుకొని, శుద్ధిచేసికొనుడి; నా కన్నులయెదుట
నుండి మీ క్రియల చెడుతనమును తొలగింపుడి; కీడుచేయ మానుడి:
మేలుచేయ నేర్చుకొనుడి." యెష. 1 : 16, 17.

రా—ముఖారి తా—ఆది

ఖండింపవలెను దుర్గుణములు ఖండింపవలెను=ఖండింపవలె పాప
కుండజొచ్చిరోసి - నందజేరినమన - గుండెపదిలము జేయుచు ॥ఖం॥
1 అంధత్వమునను రక్షణమార్గ - మందుజేరకయు=కొందొందుజూచిన
సందులేక పాప - మందు మునిగి- నగులుం చెందాలులైరిక ॥ఖండి॥

2 ఎందుకీ భ్రమలు - నీయందుండు - సందేహమికుమీ = పొందుమీ యేసు
సంబంధుడవై యున్న - వందమైన మోక్షమందు జేరుటకొరకై ॥ఖం॥

3 వెదకక నీవు సైతానుని - వెదిరించవలెను = ఎదురుగా నీ యేసు
సదరున జేరిన - వదరుబోతులెల్ల - నెదురాదలేరిక ॥ ఖండింప॥

4 ఆశింపబోకు - లోకభోగములు - ఆశపమైయుండు = వారికి యేసుని
దాసుడవైయున్న - గాసి జెందక నెప్పుడు వాసుడవాదువు ॥ ఖండిం ॥

5 నమ్మికలేకుండి - యేసునియందు - నెమ్మది కాందు = నమ్మి యేసునియొద్ద
సొమ్ము నీకున్నది - సమ్మతించి మదిని - నెమ్మది గాంచి॥ఖండింప॥

---

## మారు పుట్టుక

16.

"ఒకనికి జలజన్మమును ఆత్మజన్మమును కలిగితేనే కాని దేవుని రాజ్యములో ప్రవేశించలేడు." యోహాను. 3:5.

రా—శంకరాభరణము తా—రూపకము

పరమ రాజ్యమునకు నరులు - తిరిగి పుట్టవలయునని - పరమగురుడు
యేసుక్రీస్తు - స్థిరము చేసెను॥ పరమ॥

1 వేదశాస్త్ర మెరిగినట్టి - యూదులాధికారియైన - నీకోదేము నెరుపరి
సయ్యందు - మదినిదలచుచు ॥ పరమ॥

2 అతడు రాత్రివేళ ప్రభుని - వెతకిపోయి యెదుట, సమ్మతిని నిల్చి
పిల్చి పల్కె హితవులోదమ॥ పరమ॥

3 బోధకుండ! నీవు నిజము - సాధుడా యెహోవా యొక్క - వేద
వార్త జెప్పెదా నీ-బోధ వెలుగుదుక॥ పరమ॥

4 మరియు నీవు జేయుచున్న - గురుతు లెవ్వరైన దైవ-వరము లేనియట్టి
పాప-నరులిల జేయరు॥ పరమ॥

5 అనుచు పరిసయ్యుండు బల్క - వినుచు యేసు కనికరమున - తనకు
నిట్లు దెలిపెచాల - మనసుతోడను ॥ పరమ॥

6 క్రొత్త జన్మ మెవ్వడైన నెత్తకున్న, మోక్షమునకు నెత్తబడదటంచు
నిజము క్రీస్తు బల్కెను ॥ పరమ ॥

7 వినుచు పరిసయ్యుండు ముసలి - జనుడు మర్లి తల్లిగర్భ - మునను
తిరిగి యెట్లు పుట్టు ననుచు బల్కెను ॥ పరమ ॥

8 అంతు యేసుదెల్పె జలము-నందు నాత్మయందు జన్మ-మొందకున్న
మోక్షరాజ్య - మొందరనుచును॥ పరమ।

## పాపులను పిలచుట.

17

"ప్రయాసముపడి భారము మోసికొనియున్న వారలారా మీరందరు
నాయొద్దకురండి, నేను మీకు విశ్రాంతికలుగజేతును" మత్త. 11:28.

రా—యమునకల్యాణి తా-రూపకము

పాపులార రండి-మన ప్రాపుయేసు నేడుమండి - అతిపాపులార రండి—
రండి రండి. పాపులార - యిందు ధైర్యపడండి నేగమె - దండైనయుం
డగ మన - కుండు యేసుండని । పాపులార ॥

1 హాహా హోహో దేవవాక్యము - దేహధారులార రండి-దేహీయని
విహీనపు - సహాయము కోవలెనని । పాపులార ॥

2 ద్రవ్య మింమక లేని రక్షణ - మరెవ్వ నీ యేసయ్య రక్తము=ఇయ్యలే మయ్య మన - మయ్య దానిక్రయం ॥ పాపులార ॥

3 నిందుమనసు గలిగియు - పండజేరరండి వేగమె=నిందు ప్రియుండు యు-ఖండపురుషుండని ॥ పాపులార॥

4 నిందలన్ని బాంది ప్రభువు - మందలో వెలుగొందరేకరి=పొందుగ నిందులో - నుందురానందమున ॥ పాపులారరండి ॥

---

## విగ్రహారాధన వ్యర్థత

18.

"దేవుని సత్యము అబద్ధమునకు మార్చి వేవి సృష్టికర్తకు ప్రతిగా సృష్టిని ఆరాధించి కొలిచిరి" రోమా 1. 25.

రా—ఆనందభైరవి　　తా—ఆది

ఏలబొమ్మలను గొల్వ - ఏమిలాభము - మన మేలుబొమ్మలమగొల్వ నేమిలాభము=చాలు బొమ్మలను గొల్చుట - చాల ద్రోహంబని ఎరుగక - మేలు కోలంచు గొల్చు - మేల్మి-లేటి మిప్పుడు॥ ।ఏల॥

1 సృష్టికర్తను వీడి - సృష్టి నారాధించి - యిష్టదైవంబులనుచు - నిష్టతో గొల్చువారు=నష్టంబనుచు దెలిసిన - ఇష్టముతో మాన రది ॥ ఏల ॥

2 దేవునికన్న గ్రీయము - దేనికాంచక బొమ్మ - సేవజేసినట్లు చేకూఱు పాపంబు = భావ శుద్ధికి మనకు - ప్రభు యేసునాధు-దుండ ॥ ఏల ॥

3 మందు నూరుట కొకటి - మడిపంచె లుదుక నొకటి - బొంద గుర్తున కొకటి - బురద దుమ్ము మట్ట కొకటి=అందొక్క ప్రాయి మల్చి - యది దేవుఁడని యందు ॥ ఏల ॥

4 కుమ్మరి మన్ను గల్పి - కుండ లధికంబు జేయ-నిమ్మైన కుండ దెచ్చి యిడు పునం దమర బెట్టి=యమ్మవారంచు గవ్వ - లందులో వేసి గొల్తు ॥ ఏల ॥

5 అడవిలో జెట్టు గొట్టి-యున్న పని ముట్లు జేసి - నడివంక దీర్చి బొమ్మ - నద్రంగి జేయు పిదప=దృఢమైన రంగు బూసి-పడిపడి మ్రొక్కుచుందు ॥ ఏల ॥

6 లోహాదు లన్నింటితో పాత్రాదులం జేసి - సాహసంబున నొక్క-సారూప్య మేర్పరచి=అహో హోయని దాని - నారాధింతురు మూఢు ॥ ఏల ॥

7 వచ్చినవారి కెర - తెచ్చి హెచ్చైన రాళ్ళ-దెచ్చి గుడిలోన బెట్టి తెలివి లేనట్టి నరులు=హెచ్చైన వేల్పులంచు - తిగిరిగిరి యొరగు కొందు ॥ ఏల ॥

8 దున్నటకై యొకటి - దూడి మేకయుంటకొకటి - కొన్ని తరగతుల వారి - కోతి కోసంబొకటి=యున్నింటిలో నొక్క - టాల బోతని కొల్తు ॥ ఏల ॥

9 జేత కార్యంబు లందు - క్రీతనొందెడి వారి - చేతనుండైన వాని జేసితి మంచుగొల్వ=పాతకంబంటుగాని-ఫలమింతయైన లేదు॥ ఏల॥

